నారీస్తనభరనాభీదేశం । దృష్ట్వా మాగా మోహావేశం।
ఏతన్మాంసవసాదివికారం । మనసి విచింతయ వారం వారం॥ భజ॥ ౩

యువతీకుచముల నాభీదేశము। నొగిఁ గని పొందకు మోహావేశము।
అని మాంసవసాదివికారంబులు। తపుగతి భావింపుము పలుసారులు గో॥

నళినీదళగతజల మతితరళం । తద్వజ్జీవిత మతిశయచపలం।
విద్ధి వ్యాధ్యభిమానగ్రస్తం । లోకం శోకహతం చ సమస్తం॥ భజ॥ ౪

అగు నళినీదళజల మతితరళము। అట్టుల తలఁప జీవిత మతిచపలము।
నగవునఁ దెగుల్భున నభిమానంబున। వ్యస్త మఖిలలోకముఁ; గాను మనమున॥ గో॥

యావద్విత్తోపార్జనసక్తః । తావన్నిజపరివారో రక్తః॥
పశ్చాజ్జీవతి జర్జరదేహే । వార్తాం కోఽపి న పృచ్ఛతి గేహే॥ భజ॥ ౪॥

ధన మార్జించెడు వఱకే మనుజుఁడు। దనపరివారమునకుఁ బ్రియపాత్రుఁడు।
మనినఁ బిదప జర్ఝరకాయముతో। మాటాడ రెవరు నింట సతసుతో॥ గో॥

యావత్పవనో నివసతి దేహే । తావత్పృచ్ఛతి కుశలం గేహే।
గతవతి వాయౌ దేహాపాయే । భార్యా బిభ్యతి తస్మిన్కాయే॥ భజ॥ ౫॥

అనిలము నిలిచెడు వఱకే తనువున। నరయూను నీనేమంబును గృహమునఁ।
జన ననిలము కాయాపాయంబున। జాయ భయంపడు నీతనువుం గని॥ గో॥

అర్థ మనర్థం భావయ నిత్యం । నాస్తి తతః సుఖలేశః సత్యం।
పుత్రాదపి ధనభాజాం భీతి । సర్వత్రైషా విహితా రీతిః॥ భజ॥ ౬॥

కన మది ననితము నర్థ మనర్థము। కనంబడ దందు వెదక సుఖలేశము।
ధనులకు భయ మగుఁ గొడుకులవలనన్। దగువిధ మియ్యది యగు నెల్లెడలన్॥ గో॥

బాల స్తావ త్క్రీడాసక్తః। తరుణ స్తావ త్తరుణీసక్తః॥
వృద్ధ స్తావ చ్చింతాసక్తః । పరమే బ్రహ్మణి కోఽపి న సక్తః॥ భజ॥ ౭॥

బాలుం డాటల నాసక్తుండగు। బాలారక్తుం డౌ తరుణుఁడు దగు।
వాలెడి చింతల ముదుసలి చిక్కును। బ్రహ్మాసక్తుఁడు గాఁ డెవ్వాఁడును॥ గో॥

కా తే కాంతా కస్తే పుత్రః। సంసారోఽయ మతీవ విచిత్రః॥
కస్య త్వం కః కుత ఆయాతః। తత్త్వం చింతయ తదిహ భ్రాతః॥ భజ॥ ౮॥

ఎవ్వతె నీసతి? నీకొడు కెవ్వఁడు?। ఈ సంసారము చిత్రం బగుఁ గదు
నెవ్వని వాఁడవు? వచ్చితి వెక్కడ। నెదలుచుఁ దలఁపుము తత్త్వముఁ దమ్ముఁడ!॥

సత్సంగత్వే నిస్సంగత్వం । నిస్సంగత్వే నిర్మోహత్వం।
నిర్మోహత్వే నిశ్చలతత్త్వం । నిశ్చలతత్త్వే జీవన్ముక్తిః॥ భజ॥ ౯॥

అగు సత్సంగత నిస్సంగత్వము। తగు నిస్సంగత నిర్మోహత్వము।
ఒగి నిర్మోహత నిశ్చలతత్త్వము। ఒదవును దానం జీవన్ముక్తము॥ గో॥

వయసి గతే కః కామవికారః । శుష్కే నీరే కః కాసారః॥
క్షీణే విత్తే కః పరివారో। జ్ఞాతే తత్త్వే కస్సంసారః॥ భజ॥ ౧౦॥

తన వయసేగిన మరుపని యెచటిది?। ఘనరస మింకిన నీర సర సెచటిది?।
ధనము దఱింగినఁ బరిజన మెచటిది?। తత్త్వము దెలిసిన సంసృతి యెచటిది॥ గో॥

మాకురు ధనజనయౌవనగర్వం। హరతి నిమేషా త్కాల స్సర్వం।
మాయామయ మిద మఖిలం హిత్వా। బ్రహ్మపదం త్వం ప్రవిశ విదిత్వా॥ భజ॥ ౧౧॥

ధనజనయౌవనగర్వము మానుము। కొను నొకక్షణమునఁ గాలుఁడు సర్వము।
ఘన మాయామయ మఖిలముఁ బాయుము। కనుఁగొని బ్రహ్మపదంబును బొందుము॥

దినయామిన్యౌ సాయంప్రాతః శిశిరవసంతౌ పునరాయాతః।
కాలః క్రీడతి గచ్ఛత్యాయు స్తదపి న ముంచ త్యాశావాయుః॥ భజ॥ ౧౨॥

మఱి మఱి వచ్చును సంజయు నుదయము। మధువును శిశిరము రాత్రియు దివసము।
దఱి యాడఁగ నాయువు చనుచున్నను। వదల దాశానిల ధూవం బైనను॥గో॥

ద్వాదశమంజరికాభి రశేషః కథితో వైయాకరణ స్యైషః।
ఉపదేశోఽభూ ద్విద్యానిపుణైః। శ్రీమచ్ఛంకరభగవచ్ఛరణైః॥ భజ॥ ౧౩॥

ద్వాదశమంజరు లివి పేనిని క్రీతిఁ। దత్త్వజ్ఞులు శ్రీశంకరపదు లతి।
మోదంబున నుపదేశము చేసిరి। మును నొక వైయాకరణునకుం బోరి॥ గో॥

కా తే కాంతా ధనగతచింతా । వాతుల కిం తవ నాస్తి నియంతా।
త్రిజగతి సజ్జనసంగతి రేకా। భవతి భవార్ణవతరణే నౌకా॥ భజ॥ ౧౪॥

ధనగతచింత ప్రియంబా? నీకిలఁ। దగుశాసకుఁ డీఁక లేఁడా? వాతుల!
సునరుల సంగతియే జగమున భవ। వనరాశిని దరియించుటకుఁ బడవ॥గో॥

జటిలో ముండీ లుంఛితకేశః । కాషాయాంబరబహుకృతవేషః॥
పశ్యన్నపి చ న పశ్యతి మూఢో। హ్యుదరనిమిత్తం బహుకృతవేషః॥ భజ॥ ౧౫॥

కనుచున్నను గనఁ జాలఁడు మూఢుఁడు। కావులఁ దాలిచి లుంఛితకేశుఁడు।
గను ముండిగను నటుఁడుగ నిట్టులు। కడుపునకై కొనుఁ బలువేసంబులు॥గో॥

అంగం గళితం పలితం ముండం । దశనవిహీనం జాతం తుండం
వృద్ధో యాతి గృహీత్వా దండం । తదపి న ముంచ త్యాశాపిండం॥ భజ॥ ౧౫।

గళితాంగంబున ముండవలితమున। బలువరుసలు లేనట్టి ముఖంబున।
మొలఁగిన నతివృద్ధూనుచు దండము। జలియింపదు గద యాశాపిండము॥గో॥

అగ్రే వహ్నిః పృష్ఠే భానూ । రాత్రౌ చుబుకసమర్పితజానుః॥
కరతలభిక్ష స్తరుతలవాస। స్తదపి నముంచ త్యాశాపాశః॥ భజ॥ ౧౬।

వరున కెదుట శిఖ, వెనుకను రవి, నిశి। వరచుబుకార్పితజానువులు న్వెసఁ।
గరమున బిచ్చము, దరుతలవాసము। గలిగినను విడువ దాశాపాశము॥గో॥

కురుతే గంగాసాగరగమనం । వ్రతపరిపాలన మథవా దానం
జ్ఞానవిహీన స్సర్వమతేన । ముక్తిం నభజతి జన్మశతేన॥ భజ॥ ౧౭

ఒనరించిన గంగాంబుధిగమనము। ఘనదానములను వ్రతముల ననిశముఁ
గన లేఁ డజ్ఞుఁడు ముక్తిపదంబును। జనిశతమున నేమతమున నైననుఁ॥ గో॥

సురమందిరతరుమూలనివాస । శయ్యా భూతల మజినం వాసః॥
సర్వపరిగ్రహభోగత్యాగః । కస్య సుఖం నకరోతి విరాగః॥ భజ॥ ౧౮

నికముఁ సురపురతరుతలవాసము । నేల పఱపు మృగచర్మము చేలము।
సకలపరిగ్రహభోగత్యాగము । సలుపదు సుఖ మెవ్వనికి విరాగము?॥ గో॥

యోగరతో వా భోగరతో వా । సంగరతో వా సంగవిహీనః।
యస్య బ్రహ్మణి రమతే చిత్తం । నందతి నందతి నందత్యేవ॥ భజ॥ ౧౦॥

యోగయుతుండో సంగయుతుండో । భోగయుతుండో గతసంగుండో।
రాగిలు నెవని మనము బ్రహ్మంబున । రంజిలు మఱి రంజిలు నాతఁడ కన॥ గో॥

భగవద్గీతా కించిదధీతా। గంగాజలలవకణికా పీతా।
సకృదపి యేన మురారిసమర్చా । క్రియతే తస్య యమేన న చర్చా॥ భజ॥ ౧౧॥

ఒకకొంచెము శ్రీగీతాపఠనము । సొగి గంగాజలకణికాపానము।
ఒకపరి హరిపూజనముం జేసెను । సుకృతిని శః ం డేఁకఁ జర్చింపఁడు॥ గో॥

పునరపి జననం పునరపి మరణం । పునరపి జననీజఠరే శయనం।
ఇహ సంసారే బహుదుస్తారే । కృపయాపారే పాహి మురారే॥ భజ॥ ౨౧।

మరలను జననము మరల న్మరణము । మరల న్మాతృజఠరమున శయనము।
తరణాశక్యభవాంబునిధిఁ గనన్ । మురహర! నన్నుం గావుము కరుణన్॥ గో॥

రథ్యాకర్పటవిరచితకంథః । పుణ్యాపుణ్యవివర్జితపంథః।
యోగీ యోగనియోజితచిత్తో । రమతే బాలోన్మత్తవదేవ॥ భజ॥ ౨౩॥

పథకర్పటకృతకంథను దాలిచి । బాగోగు లెడలు మార్గమున నడిచి।
పృథుయోగార్పితమనమునఁ బ్రాజ్ఞుఁడు । వెంగలివలె బాలునిగతిఁ దోఁచును।

కస్త్వం కోఽహం కుత ఆయాతః । కా మే జననీ కో మే తాతః।
ఇతి పరిభావితనిజసంసార । స్సర్వం త్యక్త్వా స్వప్నవిచారః॥ భ ౪॥

ఎవ్వఁడ, వెవఁడను, వచ్చితి మేలా? । యెవరో జననీజనకులు నా కి ?।
నిష్వధమున నిజసంస్మృతిఁ దలఁపుము । ఎల్లవిషయములు కల యని విడువుము।

త్వయి మయి సర్వత్రైకో విష్ణుః । వ్యర్థం కుప్యసి మ య్యసహిష్ణుః ।
భవ సమచిత్త స్సర్వత్ర త్వం । వాంఛ స్యచిరా ద్యది విష్ణుత్వం॥ భజ॥ ౫॥

నీయెడ నాయెడ నంతట విష్ణువె నాయెడ నీసున వృథ కోపింతువె ?।
నే యచ్యుతతను వలతే నంతట నా యుక్తము సమచిత్తత నూ[illegible]టు। గో॥

శత్రౌ మిత్రే పుత్రే బంధౌ। మాకురు యత్నం కలహే సంధౌ।
సర్వస్మిన్నపి పశ్యాత్మానం। సర్వత్రోత్సృజ భేదజ్ఞానం॥ భజ॥ ౨౫।

అరిమిత్రపుత్రజబంధుః పట్టుల। సొరవకు మెప్పుడు విగ్రహసంధుల।
బరమాత్మను గనుచు న్నీవన్నిట। వదలుము భేదజ్ఞానము నంతట। గో॥

కామం క్రోధం లోభం మోహం। త్యక్త్వాఽఽత్మానం పశ్య విమోహం।
ఆత్మజ్ఞానవిహీనా మూఢా। స్తే పచ్యంతే నరకనిగూఢాః॥ భజ॥ ౨౬।

కామము క్రోధము లోభము మోహము। గడపుచుఁ బరిశుద్ధాత్మను గాంచుము।
ఏమూఢులు దెలియరో పరమాత్మను। నామూఢులు గందురు నరకంబును॥ గో॥

గేయం గీతానామసహస్రం । ధ్యేయం శ్రీపతిరూప మజస్రం।
నేయం సజ్జనసంగత మనిశం । దేయం దీనజనాయచ విత్తమ్॥ భజ॥ ౨౭।

గీతను నామసహస్రముఁ జదువుము । కేశవరూప మెపుడు ధ్యానింపుము।
నీతాఘులసంగతిమును జేయుము । విత్తము దీనులకొఁబఱు నొసంగుము॥గో॥

గురుచరణాంబుజనిర్భరభక్తః । సంసారా దచిరా ద్భవ ముక్తః।
ఇంద్రియమానసనియమా దేవం । ద్రక్ష్యసి నిజహృదయస్థం దేవం॥ భజ॥ ౨౮।

గురుచరణాంబుజదృఢభక్తుఁడవై। త్వరగా వెలయుము భవముక్తుఁడవై।
కరణములను మనమును నియమింపుము। కనుము నిజహృదయమందలి దైవము॥

మూఢః కశ్చన వైయాకరణో డుకృఞ్కరణాధ్యయనధురీణః।
శ్రీమచ్ఛంకరభగవచ్ఛిష్యై। ర్బోధిత ఆసీ చ్ఛోధితకరణః॥ భజ॥ ౩౦॥

భూమి నొకానొకవైయాకరణుఁడు, పామరుఁడు డుకృఞ్కరణేరకుఁడు।
శ్రీమచ్ఛంకరగురుశిష్యవితతి। చే బోధితుఁడై పొందెను సన్మతి॥ గో॥

శ్రీమచ్ఛంకరశాంకరసంచయ। కృతమంజరికల నాంధ్రమున మెఱయఁ।
ధీమనః హరిపాదములఁ గొలుచుచును। విక్రమదేవుం డనువాదించెను॥ గో॥

సంపూర్ణము.